272
A TPLAB0B118

# సహదేవపశువైద్యము

గీర్వాణ గ్రంథకర్త:

సహదేవుఁడు

ఆంధ్రీకృతికర్త:

నారనార్యుఁడు

వ్యాఖ్యాత:

సోమరాజు రామానుజరావు.



ప్రకాశకుఁడు:

కురుకూరి సుబ్బారావు.

సరస్వతీ బు డిపో, బెజవాడ.

1938.

కాపీరైటు) (వెల రు 0—6—0

# విషయసూచిక.


1 దొమ్మరోగము
2 ఇంకొకవిధమైనచికిత్స
3 దొమ్మకు పథ్యము
4 దొమ్మకు రక్షవేయుచోట్లు
5 పాలదొమ్మకు చికిత్స
6 అతివిరేచనములకు చికిత్స
7 ఉరకరోగమునకు చికిత్స
8 పారుటకు చికిత్స
9 నెరిడెవ్యాధి
10 నెరిడెకు వైద్యము
11 వేరొక వైద్యము
12 ఇంకొక వైద్యము
13 మరియొక వైద్యము
14 లక్షణము తెలియరాని వ్యాధులకు
15 నల్లమునురుకు
16 ఇం[illegible]క వైద్యము
17 మరియొక వైద్యము
18 అరకద మను రోగమునకు
19 మలిమిడికి చికిత్స
19 కుంటుకు చికిత్స
21 అల్లుకట్టుకు చికిత్స
22 రొమ్ముపట్టుకు చికిత్స
23 బొడ్డెంకకు లక్షణము
24 ఇందుకు చికిత్స
25 కడుపునొప్పికిచికిత్స
26 కడుపుబ్బునకుచికిత్స
27 ఇరువాయిగట్టుటకు చికిత్స
28 చికిత్స పరిమాణము
29 ఇంకొక విధము
39 వాతమునకు చికిత్స
31 జంబుకవాత లక్షణము
32 పైదానికి చికిత్స
33 తీటకు చికిత్స
34 తలతీటకు చికిత్స
35 అంగిటముండ్లకు చికిత్స
36 ముక్కులబంతికి చికిత్స
37 వగర్పునకు చికిత్స
38 గుండెవగర్పు. దగ్గునకు చికిత్స
39 పుచ్చినపుండుకు చికిత్స
40 పుండుతొలగుటకు చికిత్స
41 ఈచకాలికి చికిత్స
42 విరిగిన కాలికి చికిత్స
43 పొటుపోనందుకు చికిత్స
44 నరము తెగినందుకు చికిత్స
45 కాలికుంటునకు చికిత్స
46 గాలి తగులకుండుటకు
47 మంత్రము
48 మెత్తగాళ్ళకు చికిత్స
49 కురుమకు లక్షణము
50 చికిత్స
51 ఇంకొక చికిత్స
52 చండికాలికి చికిత్స
53 మణుపుకాలికి చికిత్స
54 సాధారణ రోగములు
55 శెలతెవులుకు చికిత్స
56 ఇంకొక చికిత్స
57 యీదుపులికి చికిత్స
58 కల్లవాపునకు చికిత్స

59 తిక్కరోగమునకు
60 కామెలకు
61 కండ్లనీరు గ్రమ్ముటకు
62 ఇంకొకవిధము
63 మరియొక చికిత్స
64 వేరొక చికిత్స
65 ఇంకొక చికిత్స
66 ఆవిరికి చికిత్స
67 పుప్పులకు వైద్యము
68 ఇంకొకవిధము
69 నిలువుకండ్లకు
70 గువ్వరోగమునకు
71 చూలు నిలువఁబడుటకు
72 నెలతక్కువగా ఈసినపశువునకు
73 పాలు చేపుటకు మందు
74 మావితిన్నదానికి
75 తొలిచూలి దౌష్ట్యమునకు
76 దూడను మరుగుటకు
77 పాలిచ్చుటకు చికిత్స
78 ఆవు చేపుటకు చికిత్స
79 చూలు నిలువనిచో చికిత్స
80 దూడను మరుగని దానికి
81 చేపని పశువులకు
82 ఇంకొక చికిత్స
83 వేరొక చికిత్స
84 ఇంకొక చికిత్స
85 దృష్టిదోషమున పాలెండుటకు
86 ఇంకొకవిధము
87 ఈనుట కిబ్బందిపడు పశువునకు
88 గజ్జీటకు చికిత్స
89 దురదకు మందు
90 మరియొకవిధము
91 మావిపడుటకు
92 బలహీనపశువునకు
93 అబ్బుపుంటికి
94 పోట్లగొడ్డుకు
95 పుప్పిపంటికి
96 పొదుగు పుచ్చుటకు
97 వగర్పుకు
98 ఇందులకు చికిత్స
99 తేలుపోటుకు
100 ఇంకొకవిధము
101 పాముకాటు లక్షణము
102 అందులకు చికిత్స
103 వేరొకవిధము
104 పేరెరుగని రోగములకు
105 తైలముతలకెక్కినందుకు
106 చెవిలోని పుంటికి
107 సకల రోగములకు
108 ఒడలుకాలిన పశువునకు
109 కణుతులకు
110 కడుపులో చచ్చినదూడకు
111 వాయువునకు
112 రొమ్ము దగ్గుకు
113 ఇంకొకవిధము
114 మరియొకవిధము
115 నీరుడు బంధించుటకు
116 గ్రంథాంతము

# పీఠిక

ఈ సహదేవ పశుచికిత్సను తొలుదొల్త గీర్వాణభాషయందు మహాభారతవీరుఁడును, మాద్రీద్వితీయ కుమారుఁడును, పంచపాండవులలో తుదివాఁడును నగు సహదేవుఁడు రచియించెను. ఏతద్గ్రంథము గీర్వాణభాషానభిజ్ఞులగు సామాన్యజనులకు నిరుపయోగకరం బగుట, 'నారన' యను నామముగల సనాతనాంధ్రకవి యాంధ్రమున పద్యరూపమున రచియించెను. దీనిని ఇటీవల ననేకులు ముద్రించి యున్నారు. అందు ముఖ్యముగ మదరాసునందలి ప్యూరవ తెలుగు ముద్రాలయములవారు, పూర్వకవి రచితములగు ప్రతియాంధ్రగ్రంథమును సన్నని కాగితములమీద అలికినట్లు గనఁబడు నక్షరములతో చౌకధరలకు ముద్రించియున్నారు. అందీసహదేవ పశువైద్య మొకటి. సంస్కర్తగినవాఁడు లేనందున నందుగల తప్పులకు మితములేదు. వినోదమునకు గాని కాలక్షేపమునకుగాని చదువుకొను శృంగార భక్తి ప్రబంధములలో తప్పులు ముద్రింపఁబడినను ఒప్పులు ముద్రింపఁబడినను అంతభయములేదు. వైద్యశాస్త్రములు తప్పులతో ముద్రింపబడినచో నెట్టిప్రమాదములకు లోనగునో యాలోచింపుఁడు. వేరు గ్రంథాధారము లేనందువలన, ఆ తప్పుల పొత్తములను చూచి ప్రజ లొనర్చిన వైద్యములవలన నెన్నిపశువులు మరణించెనో గణింపఁజాలము. దుష్టవైద్యునివలెనే దుష్టవైద్యగ్రంథమును ప్రాణాపాయకరమై యున్నది.

హిందూదేశమునకు గోవు పూజనీయమైనది. గోసంరక్షణము అనాదినుండియు భరతవర్షమున నాచారమే! మ్లేచ్ఛపాలన మారంభమైనప్పటినుండియు నిప్పటివఱకు గోహింస హిందూదేశమునఁ బ్రబలిపోయినది. పశువులను కాళికాది శక్తులకుఁ బ్రజలు మౌఢ్యమున బలియిచ్చుచున్నారు. నోరెఱుఁగని పశువులు రైతులపొలములలోఁ బడినప్పుడుగాని, ఇతరులకు హానిచేసినప్పుడుగాని బందెలోఁ బెట్టుచున్నారు. అచ్చటవానికి

రక్షణ సరిగా జఱుగుటలేదు. ముసల్మానులును, ఆంగ్లేయులును, అంత్య జాతులును గొడ్డుమాంసమును రుచ్యముగాఁ దినుచున్నారు. పశువుల కొఱకు వదలిన బీళ్ళను రైతు లాక్రమించుచున్నారు. ఫారెస్టు డిపార్టు మెంటువారి కొన్నినిబంధనలు పశువులకు హానిప్రదములుగా నున్నవి. కొందఱు వర్తకులు చమడాలవ్యాపారమును అనగా తోళ్ళవర్తకమును ఆరంభించి పశునాశనమును కాంక్షించుచున్నారు. ధనకాంక్షాపరులు కొందఱు పశువులకు మేత తక్కువగ బెట్టి పాలధికముగ గిసిగిసి తీయుచున్నారు. రైతులు కొందఱు తమ పశువులకు సరియైన కొట్టములు, శాలలు ఏర్పాటుచేసి యుండలేదు. రోగములకు చికిత్స తెలియఁగక కొందఱును, అశ్రద్ధచే కొందఱును ఊరకుండుటచే పశునాశ మధికముగఁ గల్గుచున్నది. రైతులు మంచి ఆబోతులను పెంచకపోవుటచే బక్కగొడ్ల వలనఁ గలిగిన సంతానము మంచిదిగా నుండుటలేదు. పశువులను పెంచుటకు శక్తిచాలని రైతులు పుల్లరికి విడువగా, అచ్చట వృశ్చిక సర్పాదులవలన అనేకగోవులు నశించుచున్నవి. పంచాంగములం దెచ్చటచూచినను గోవృద్ధి స్వల్పముగను తన్నాశమధికముగను కన్పడుచున్నది. గంగిరెడ్లవాండ్రు నిజోదరపోషణార్థమై గోవృద్ధిచేయ సమర్థములైన మంచి యెడ్లను నిరుపయోగ పఱచుచున్నారు. కొందఱు అచ్చుపోసి విడిచిన యెడ్లను తమ పశువులపై నెక్కనంతవఱకు సరిగా చూచి పిదప ఊర నుండనీయక తఱిమికొట్టుదురు. తోళ్ళకొఱకు కొందఱు ఆరోగ్యదశయందున్న పశువులకు మందులు పెట్టి చంపుచున్నారు. మతావేశముగల మూఢజనులు జాతరలయందు చేయు పశుహింస యపరిమితము.

ఇట్టి పశునాశనమును చూచి కొలదిదినములనుండియు పశువృద్ధి చేయు నిమిత్తము కొందఱు బుద్ధిమంతు లాలోచించి గోరక్షణసంఘముల నేర్పఱచియున్నారు. ఈసంఘము లాంధ్రదేశమున చాలగలవు. అందు విజయవాడలోని సంఘమువారు విశేషశ్రమ గైకొని కీర్తి వడయు

చున్నారు. కసాయివాండ్ర కొర్తముఁలకు న్యాయముగా నరిగి పశువిక్రేత లను బ్రతిమాలియో, ధన మిచ్చియో పశువుపై కత్తి పడకుండ రక్షించి పెద్దమందను పోగుచేయుచున్నారు. ఇందులకు డబ్బాచందాలు డొనేషన్లు కూడా వసూలు చేయుచున్నారు. ప్రతిశుక్రవారమును ఈ పశువులను పురమధ్యమునుండి తోలుకొనిపోవు మిషపై ప్రజలకు తమ సేవను గనంబరచుచున్నారు. వీనికొఱకై కనకదుర్గగట్టువద్ద తగినసౌకర్య ముల నన్నింటిని చేసినారు. దయాస్వభావ మేమాత్రముగలవారైనను తమకు తోచినంత ధన మీవ్యవస్థకు దానముచేయుట పుణ్యప్రదము.

సర్కారువారు 1890 సం॥ 11వ నెంబరుగల ఆక్టు నొకటి తయా రుచేసి పశుహింసను నివారింపదలంచినారు. అందులకై పశువును కోయ దలచినవానికి చిన్నరుసుమును విధించియున్నారు. ఐనను ఈరుసుము స్వల్ప మొత్తమగుటచేత కటికవాడు గణింపుటలేదు. దీనినిదయలోసర్కారు వారు ఏబదిరూప్యములవఱకు పెంచినచో, కొన్న ధనమునకన్న సర్కారు రుసు మధికమగుటచేత కొనుటకే భీతినంది యీవృత్తిని పూర్ణముగమా నుకొనును. పశురక్షణకై సర్కారువారు పెద్దాపురం, మధుర, చెన్నపురి తిరుచునాపల్లి, బళ్ళారి, ఏలూరు, సైదాపేటలందు వెటర్నరీ హాస్పిట ల్సును స్థాపించినారు. చిన్నచిన్న వెటర్నరీ వైద్యాలయములు ప్రతిగ్రా మమందును గలవు. చెన్నపురియందు సుమారు నూర్గురువిద్యార్థులు పశు వైద్యము నభ్యసించుచున్నారు.

1922 సంవత్సరమున కృష్ణా గోదావరీ కర్నూలు గంజాము నెల్లూ రు అనంతపురము ఆర్కాటు మధుర బళ్ళారి జిల్లాలయందమితముగ పశు నాశనమగుటచే ఆయాస్థలములయందెల్ల పశుచికిత్సాలయములను స్థాపిం చిరి. పశువులకు టీకాలు వేయుపద్ధతిని నయితము కనిపెట్టియున్నారు.

అనకాపల్లి వంగోలు పిఠాపురము బళ్ళారి కొత్తచెఱువు తాడేప ల్లిగూడెం మొదలగు స్థలములందలి పశువులనంతలకు సర్కారువారు

మంచిసహాయమును చేయుచున్నారు. కోయంబత్తూరునందు బక్కగుళ్లములతో శ్రేష్ఠములగు నశ్వములను కలిపి సత్సంతతిని గల్గించిరి.

ఈసహదేవపశువైద్యము చూచుటకు తేలికగా నుండునేకాని కొన్నిపదములు విషయానుభవములేక అర్థముకాజాలవు. దీనిని మంజువాణీ ముద్రాలయమువారు ప్రకటించినారు. నేనీగ్రంథమునకు తాత్పర్యమును వ్రాయుపట్ల ఆగ్రంథమే మిగుల చేయూతయయ్యెను. కొండపల్లి వీరవెంకయ్యగారు శ్రీ మద్దూరి శ్రీరామమూర్తిగారిచే తాత్పర్యమును వ్రాయించి ప్రచురించిన 'సహదేవపశువైద్యశాస్త్రము'న తప్పులు కుప్పలుగానుండి మదరాసుప్రతులను మేలనిపించుచున్నది.

ఈగ్రంథమువ్రాసిన నారన యనుకవి కవిత్వమందెంతశక్తి గలవాడో తెలియదు. ఈగ్రంథమును విమర్శించి చూచినంతవరకు (అదిమనకు లభించిన ప్రతుల యందలి కవిదోషమో చెప్పలేము) ఇం దనేక ఛందో దోషములు గలవు. నేను సాధ్యమైనంతవరకు కొన్నిటిని సవరించితిని. తప్పులను క్రిందిపీఠిని సూచించితిని.

ఏది యెట్లున్నను ఇది శాస్త్రగ్రంథము కావున ఛందోదోషమంత పాటింపనక్కఱలేనిది. సంస్కృతగ్రంథమును భాషాంతరీకరించి, ఆంధ్రగ్రంథముగా మన కందఁజేసినందుల కేతత్కవి వందనార్హుఁడు.

బెజవాడ మకాం, ఇట్లు సుజనవిధేయుఁడు,
ది 8—4—1928. సోమరాజు రామానుజరావు.

# సహదేవపశుచికిత్స.

క. శ్రీయునుఁ గీర్తియు నధికో
పాయంబునుఁ గలుగుఁ బుణ్యాపరులగు దీనం
జేయంగఁబడెడు నీకృతి
పాయకఁ జదివినను వ్రాయఁ బాఠముఁగొన్నన్. 1

ఉ. దేవసమానుఁడైన సహదేవుఁడు గోవులకున్ హితంబుగా
పావనమైన వైద్యము శుభస్థితిఁ జెప్పెను; దానికిన్ మహా
దేవు వరప్రసాదమున తెన్గున జెప్పఁదొడంగితిన్ వడిం
గావున సత్కవీంద్రుఁడ నఖండచరిత్రుఁడ నారనార్యుడన్.

తాత్ప:—దేవతలతో సమానుఁడైన సహదేవుఁడు గోవులు మొదలైన పశువులకు శ్రేయస్సు గలుగునట్లు వానికవసరమగు వైద్యమును శాస్త్రముగా రచించి యున్నాఁడు. దానిని పరమేశ్వరకృపచేత, నారన యను పేరుగల కవీంద్రుఁడనైన నేను తెలుగునకు భాషాంతరీకరించు చున్నాను.

క. దేవతలు మర్త్యమున మను
జావళిఁ బుట్టించి వారి కమృతము గురియం
గా వేడి సురభి కమతులు
గోవుల బుట్టించినట్టి గోధనమునకున్. 3

క. భావించి యమరనిష్టము *
గావించగఁ బుణ్యమగును కలియుగమందున్
గావున వైద్యము క్రియతో
జీవధనంబునకు నెఱిఁగి చేయుఁడు మనుజుల్. 4

---

* "దాఁకిష్టము" అను పాఠాంతరము సహదేవపశువైద్యశాస్త్రమున నున్నది.

తాత్ప:—దేవతలు మానవులను పుట్టించి తమతోపాటుగా వారికింగూడ నమృతము నిప్పింపంగోరి కామధేనువువలన ఆవులను పుట్టించిరి. ఆయావులకు ప్రీతిచేయుటచే పుణ్యము గల్గునుగాన, ఓమనుజులారా! కలియుగమున పశువులకు చికిత్స చేయుండు.

క. రోగము గోవుల కొదవిన
వేగంబున మందు లెఱింగి వివరముతోడన్
బాగుగఁ బెట్టుము పసికిని
వేగమె రోగములు మాసి వృద్ధిం బొందున్. 5

తాత్ప:—గోవులకు రోగమువచ్చిన వెంటనే దానినెఱింగి మందు వేసినయెడల పసులకు రోగశాంతిగల్గి, మందలు వృద్ధినందును.

—♦ దొమ్మ రోగము ♦—

క. దొమ్మైన గోగణంబులు
నెమ్మది కడుపుబ్బు వణకు నీరుగఁ బారున్
క్రిమ్మర నూరువు వెళ్లును
సమ్మదమున నేల కొక్క జామున వ్రాలున్. 6

తాత్ప:—దొమ్మరోగమువచ్చిన పశువులకుకడుపుబ్బు, వణకు గల్గును. మలము పలుచగ నీటివలె నగును. వగర్పుగల్గును. చికిత్సచేయకున్నచో ఒకజామున నేలపైఁబడును.

క. మేతచెడి నెమరు పెట్టదు ♦
చేతయుడుగు ముక్కుతడియు చెమటయు నణగున్
రీతిచెడి నల్లబడునొగి
నీతెరగున నుండు దొమ్మలెరుగుడు పసికిన్. 7

♦ మేతుడిగి నెమరుపెట్టదు అని పాఠాంతరము.

తాత్ప:—మేతమానును; నెమరువేయదు. కదలక మెదలకుండును. ముక్కులందు తడియు చెమ్మటయు ఆరిపోవును. శరీరము నల్లబడును. దీనిని దొమ్మరోగముగా తెలియవలెను.

—♦ దొమ్మకు చికిత్స ♦—

క. మును త్రిఫల త్రికటుకములు ♦
అనుపానము చింతపులుసు నమరికతోడన్
విను మెనుపపేడరసమును
ననువుగ దా నిడిన దొమ్మలప్పుడె మానున్. 8

తాత్ప:—త్రిఫలము లను పేరుగల కరక తాడి ఉసిరికలును, త్రికటుకములను పేరుగల శొంఠి పిప్పలి మిరియాలును చింతపులుసును గేదె పేడ నీళ్ళతోనూరి పోసినయెడల దొమ్మ నివారించును.

—♦ ఇంకొకవిధమైన చికిత్స ♦—

క. భల్లాతకపురక్తముతో
కల్లుప్పును శొంఠిపొడుము కరిధూపంబున్
నల్లనిమేకల మూత్రముఁ
దెల్లముగాఁబెట్ట దొమ్మతెవులున్ మానున్. 9

తాత్ప:—ఎలుగుబంటినెత్తురుతో ఉప్పును శొంఠిపొడుము కరిధూపమును నల్లమేకలమూత్రమును కలిపియిచ్చిన దొమ్మ మానును.

—♦ దొమ్మకు పథ్యము ♦—

ఆ. నీరుద్రావకుండ నిబ్బరముగనుంచి ♦
కాకనీరు ద్రావ కరగఁబోసి
కొఱ్ఱగంజి కాచి కొమరొప్పఁ బెట్టినఁ
జూడవలదు దొమ్మ సురిగిపోవు. 10

♦ మును దీనికి త్రిఫల ద్రికటిక అని పాఠాంతరము.

♦ నీరు ద్రావకుండ నిభరంధ్రమునునుంచి అని పాఠాంతరము.

తాత్ప:—చలినీళ్లు త్రాగనీయక నీరు కాచిపోయవలెను. కొర్ర గంజి పెట్టవలెను. తిరిగి చూడకుండ దొమ్మ నివారించును.

—♦ దొమ్మకు రక్ష వేయు చోట్లు ♦—

క. బరియెముకసందు దాపల
నురమున వాలమ్ముక్రింద నొగిముక్కుపయిన్
గురితప్పక చూడినచో *
నరయంగా దొమ్మమాని యప్పుడె కుదురున్ 11

తాత్ప:—ఎడమప్రక్కనుండు ఎముకసందున ఎదురురొమ్ముమీద తోకక్రింద ముక్కుమీద గుర్తులు పెట్టిన దొమ్మమానును.

—♦ చలిదొమ్మకు క్రియ ♦—

క. మానెడు సోలెడు గిద్దెడు
దానకముగ నాపుపంచితంబునుగూడన్
మానుగ గడుపున బోసిన
ధేనువులకు శీతదొమ్మ తీవ్రం బణగున్. 12

తాత్ప:—మానెడు సోలెడు గిద్దెడు ఆవుపంచితమును వ్యాధి హెచ్చుతగ్గుల గుర్తించి యిచ్చినచో చలిదొమ్మ మానును.

—♦ పాలదొమ్మకు చికిత్స ♦—

ఆ. పాలుగుడిచి యొడలువాడియు, డస్సియు
నున్న క్రేపులకును నొప్పుగాను
గలిజెరాకుపసరు గలిపి పెన్నేరుగడ్డ
బెట్టచుల్కనగును నిట్టలముగ.

తాత్ప:—పాలుత్రాగి, శరీర మలసియున్న దూడలకు గలిజేరాకు పసరు పెన్నేరుగడ్డ నూరి పెట్టినయెడల పాలదొమ్మమానును.

ఆ. పాలు కడుపులోన బరగంగజేరిన ‡

---

* నిరవును తప్పకబూడిన అని పాఠాంతరము.

‡ పరగంగ శేరిన అని పాఠాంతరము.

దూడనిదురఁబోదు; తోటుప్రపడును
పాలదొమ్మ యందు ప్రబరులు రెంటుచూడి
కలిని గింశుకంబు కలిపి పెట్టు. 14

తాత్ప:—పాలు కడుపులో గడ్డకట్టినట్లయిన దూడనిద్రింపక తొట్రుపాటు నొందును. దీనిని పాలదొమ్మయందురు. అందులకై రెండు పత్రికల కాల్చి మోదుగమాడలను కలితో గలిపినూరి పోసిన మానును.

—♦ అ తి వి రే చ న ము ల కు చి కి త్స ♦—

ఆ. చెలిదిమేసి వేగ చెడఁబారి చిక్కిన
నూనె ముంచి యేకు నోటికిడుఁడు
కాకచల్లతోడ కనకంపు పత్త్యాకు
కలియనూరిపెట్టు; కట్టుకొనును. 15

తాత్ప:—దూడ చెలిది తిని మిక్కిలి పారుకొని చిక్కినచో నూనె లో ముంచి ఏకు నోటికియ్యవలెను. పైడిపత్తిఆకును వేడిచల్లలో నూరిపో యవలెను. ఆజబ్బు నివారించును.

—♦ అ ర క రో గ ము న కు చి కి త్స ♦—

ఆ. పాలుమిగుల గుడిచిపాలరగకయున్న
క్రేపులకునుఁ బెట్టు మేపుతోడ
పెరుగు గంజియాకు పెన్నేరిగడ్డయు
నరక తెవులు మాన్పు నాక్షణంబ. 16

తాత్ప:—పాలు ఎక్కువగా త్రాగి అరగకున్న దూడలకు పెన్నే రుగడ్డ గంజాయి పెరుగుతో గలిపి మేతతోగూడ పెట్టవలెను:

—♦ పా రు ట కు చి కి త్స ♦—

క. పలుమరుపారెడు లేగకు
సలలితముగఁ ద్రికటుకంబు చల్లయుబెట్టన్

తలగక పారుటమానును
ఇలలోపల నగ్నివైద్య మేర్పడజేయన్. 17

తాత్ప:—విశేషముగా పారెడు లేగకుఁ దిరికటుకములు చల్లతో బెట్టి చురకలు వేయవలెను.

—♦ పాలకూరకు చికిత్స ♦—

ఆ. పాలకూరగొనుచు పలుమారుపారిన
బరులబండ్లగాక బరగ నిడుఁడు
వెన్నతోడ పసపు వెలికొట్టులనుఁ బెట్ట
తెవులుమాని లేగ తెలివి నొందు. 18

తాత్ప:—పాలకూరయను రోగము వచ్చి తరుచుగా పారుచున్నయెడల దూడకు పక్కలను పండ్లమీదను కాల్చవలెను. వెన్నతో పసుపు తెల్లకొట్టులు కలిపి పెట్టవలెను.

ఆ. పాలుమిగులఁగుడిచి పారి చిక్కినలేగ
పెరుగుగంజియాకు పిసికిపెట్టి
యేడునాళ్ళు తంగెడిగురు పెట్ట
పారుటెల్లమాని బ్రిదుకు కేపు. 19

తాత్ప:—ఎక్కువగా పాలుత్రాగి పారుకొని చిక్కిపోయిన లేగకు పెరుగుగంజాయి పిసికి 7 దినములు తంగేడిగుళ్ళతో పెట్టవలెను.

—♦ నెరిడె వ్యాధి ♦—

క. నెరిడెలోపుట్టిన పసరము
నెరజిక్కియు మేత లుడిగి నీరుదొలంగున్
జరువును ఇట్లాక మాసము
నరయుగ లేకున్న నురము కడ్డము పెరుగున్. 20

తాత్ప:—నెరిడెలుపుట్టిన పశువు నీరు మేత మాని చిక్కుచు ఆరు నెలలుగడువును. కనుగొనలేనిచో రొమ్మున కడ్డముగాపెరుగును.

—♦ నెరిడెకు వైద్యము ♦—

ఆ. సమను కొఱ్ఱపిండి సరి కరిధూపంబు
నూనెగలిపి ముక్కులోన విడిచి
వెదురుటాకుపసరు బెట్టుచు గొట్టెకు
దినదినాన నెరిడె తిరిగిపోవు. 21

తాత్ప:—కొఱ్ఱపిండి, కరిధూపము సమానములుగా జేసికొని నూనెకలిపి ముక్కులోపిండి వెదురుటాకుపసరు గొట్టముతో నొక గొట్టములోని కీయుగా నెరిడెలుమానును.

—♦ వేరొక వైద్యము ♦—

క. కలితో మోదుగుపువ్వును
కలయంగా నూరిపెట్ట గరిధూపమునం
దలపడ సున్నము వేరే
వెలయగఁ బెట్టినను నెరిడె వేగమె మానున్. 22

తాత్ప:—కలితో మోదుగుపూవు నూరిపెట్టినను, కరిధూపము ససున్నముబెట్టినను నెరిడె మానును.

—♦ ఇంకొక వైద్యము ♦—

క. దిరిసెన చక్క రసంబును
నరయంగా నావుపాలు గలియున్ మరియున్
గరిమ దనరంగ మానెడు
తిరముగ నిడియున్న నేడుదినముల మానున్. 23

తాత్ప:—దిరిసెన చక్కరసమును, ఆవుపాలు, కలిమానెడిచ్చిన యెడల 7 రోజులలో మానును.

—♦ మరియొక వైద్యము ♦—

ఆ. దాపలి బరిమొదలు దబ్బనంబున గొని
నాల్గువేళ్ళ నాట నయముతోడ

నూనెఁ గాచిపోయ నొప్పి శమించును
అష్టరేఖ చూడు డందుమీద.

తాత్ప:—మొదలు ఎడమవైపున 4 వేళ్ళవెడల్పుగా నూనెకాచి పోసి, అటుమీద ఎనిమిదిచోట్ల చురకలు వేయవలెను.

—♦ లక్షణము తెలియరాని వ్యాధులకు ♦—

సీ॥ ఏరోగమైనను నేర్పరింపఁగరాక
నీరుమేపు లుడిగి నిలిచియున్న
కలితోడ నాగి కింశుకప్రసూనములు
మర్దించి యద్ది కాలుపడిన గలిపి
మూఁడుదినము లీయ మునుకొని రోగంబు
లేవైన మనుజున కెరుకపడును
ఎలుగునెత్తురు కలి యేరోగమైనను
కలిపి, పెట్టినమాను; గడకతోడ
దాన రోగతతులు గానకయున్నను
నిట్టి రెంటిలోన నేదిదొరకు
నదియు గూర్చిపెట్ట నతిశీఘ్రమున మాను
రోగములు తొలంగి రూపువచ్చు. 25

తాత్ప:—పశువు నీరు, మేత మానియుండి రోగము బోధపడకున్నయెడల కలితో మోదుగపువ్వునారిమాత్రముతో కలిపి మూడు నాళ్ళిచ్చినట్లయిన రోగము నిర్ధారణమగును. తరువాత యెలుగుబంటినెత్తురు కలితో గలిపిపెట్టిన వ్యాధి నయమగును. వ్యాధి తెలియకున్నను ఈ రెంటిలో నేదిదొరికిన నది యీయవచ్చును. వ్యాధిమానును.

—♦ నల్లమునురుకు ♦—

క. నల్లఁబడి మేతలుడిగినఁ
దెల్లంబుగ తెలివిలేక దీనతనున్న౯

కల్లును మోదుగపువ్వును
కల్లకడసఁబెట్ట రోగగతులును మానున్. 26

తాత్ప:—పశువు నల్లబడి, మేతమాని, తెలివిలేక మందగించిన యెడల కల్లుతో మోదుగపూవును నన్నెకలుపై నూరియిచ్చినచో రోగములు మానును.

—♦ ఇంకొక వైద్యము ♦—

క. దిరిశెనచక్క రసంబును
నరమూత్రము మానె జేసి నవదివసంబుల్
పరిపాటిబెట్టి నేనియు
మరివుట్టదు; నల్ల తెగులు మానుగ బసికిన్. 27

తాత్ప:—దిరిశెనచక్కరసముతో మనుష్యునిమూత్రము కలిపి 9 రోజులు మానెడు నొప్పున నీయవలెను.

—♦ మరియొక వైద్యము ♦—

ఆ. వెదురు నేలవేము వెలయంగ నల్లేరు
నడ్డరనము బొందయావపిండి
గుముడుపండ్లు గూర్చి కోరి తా కలితోడ
నలరబెట్ట మాను నల్లతెగులు. 28

తాత్ప:—వెదురాకు, నేలవేమాకు, నల్లేరు, అడ్డనరము, ఆవపిండి, గుముడుపండ్లు కలితో నూరి పెట్టవలెను.

—♦ అరకదము అను రోగమునకు ♦—

క. కల్లుప్పు నావపిండియు
వెల్లుల్లి పదేనుతిథులు విడువకఁబెట్టన్
చల్లన్ దినమున గొట్టెదు
తెల్లముగా నరకదంబు తేరును పసికిన్. 29

తాత్ప:—ఉప్పు, ఆవపిండి, వెల్లుల్లి 15 దినములు మానక గొట్టముచల్లతో బెట్టిన అరకద మనువ్యాధి మానును.

—♦ మ లి మి డి కి చి కి త్స ♦—

క. మలిమిడికి చిత్రిమూలము
పెలుచ న్నాముదముఁ గలిపిపెట్టుదు రిట్లున్
నులివెచ్చ త్రికటుకముతోఁ
పొలుపుగ బూయంగఁ బ్రాతపుండునుమానున్. 30

తాత్ప:—చిత్రిమూలము, ఆముదము కలిపి పెట్టవలెను. నులివెచ్చని శొంఠి పిప్పలి మిరియాలు నూరి ముద్దజేసి పుండుమీద రాయవలెను.

—♦ కు ం ట్లు కు చి కి త్స ♦—

క. మిరియపుగింజలు తప్పక
యిరువదియును దుష్టుపాకులేదు మెదిపియు
టిరసము ముక్కునఁ బిడువగ
కురునలిగొను పసర మెందు కుంటకమానున్. 31

తాత్ప—ఇరువదిమిరియాలు, ఏడుదుష్టుపాకులు కలిపినూరిఆరసము ముక్కునబిండినచో మలిమిడి కుంటు నివారించును.

క. మలిమిడిని కుంటెనేనియు
చెలిమిడి దుష్టుపులవేళ్ళు జెందియు నీరున్
కలిపి యుడికించి పెట్టినఁ
బొలుపుగ నీకుంటు దీరిపోవుం జసికిన్. 32

తాత్ప:—మలిమిడితో కుంటినట్లయితే చిర్రికూర, దుష్టుడువేళ్ళు నీళ్ళలో ఉడికి చికట్టవలెను.

—♦ అ ల్లు ప ట్లు కు చి కి త్స ♦—

క. ముక్కుకొన తోఁకతుదియును
నక్కజముగ తాంటగొలచి యది సగముగ బ

ట్టికొక్కుకు చూడినయెద్దుకు
నక్కజముగ నల్లుపట్టు నప్పుడెసూనుక్. 33

తాత్ప: ముక్కుకొనమొదలుకొని, తోకతుదివరకు త్రాటితో కొలచి ఆత్రాటును చెరినగముచేసి కొల్చి అస్థలాన చుటుక వేయవలెను.

### రొమ్ముపట్టుకు చికిత్స

ఆ. రొమ్ముపట్టు పసికి రుజ మాన్పఁదలతేని
కోరి తెలకపిండి గ్రొట్టుజేసి
పాలుగలిపిపెట్టి పంత్రెండుదినములు
మేపుబెట్ట నెద్దు రూపువచ్చు. 34

తాత్ప:—రొమ్ముపట్టున జబ్బుగలపశువునకు, తెలకపిండిని పాలలోగలిపి ప్రతిరోజు గ్రొట్టుజేసి 12 దినము లీయవలెను.

### బొడ్డెరికలక్షణము

క. తొట్రుపడు లేచి పలుమరు
నిట్రిలపడి చూచి కాళ్ళునీల్గుచు నుండున్
మెట్టదు మెయ్యదు బొడ్డెరు
పుట్టిన పసరము చికిత్స పొందెరుఁగంగా. 35

తాత్ప:—తొట్రుపడుచు పలుసార్లులేచి పడుచు కాళ్ళు ఈడ్చిలబడుచు నివ్వెరపడి చూచుచు నడక మేత మానినచో బొడ్డెరికవ్యాధిగా నెఱుగవలెను.

### ఇందుకు చికిత్స

క. ఆరోగమెత్తినప్పుడు
నారం గరిదూప త్రికటుకంబువులును మా
బీరాకుపసరునేయిని
భూరమణా పొయ్య గట్టు బొడ్డెరుమానుక్. 36

తాత్ప:—బొడ్డెరిక అను వ్యాధి వచ్చినప్పుడు, త్రికటుకముల నీరు, కరిదూపము, బీరాకుపసరు, నేయిని కలిపి పోయవలెను.

## —♦ కడుపునొప్పికి చికిత్స ♦—

క. కడుపుకట్టి నేలఁబడుచు లేచుచునున్న
పసరమునకు నెఱిఁగి మునల మొకటి
మూఁడునాల్గుసార్లు మున్నుగా జఠరము
వేయఁ గడుపుకట్టు వేగమాను. 37

తాత్ప:—కడుపులోనొప్పివచ్చి పడి లేచి దొరలుచున్న పసరమునకు రోకలి దెచ్చి మూడునాల్గుసార్లు గట్టిగా పొట్టపైనుండి దొరలింపవలెను.

## —♦ కడుపుబ్బునకు చికిత్స ♦—

ఆ. వెన్ను మేసి కడుపువింతగా నుబ్బిన
పసికి పాతదంటు మసిజలంబు
పెట్టి నదియు కంట్లె బెట్టియుండిన వేగ
నొక్కగడియలోన నుబ్బుమాను. 38

తాత్ప:—వరి, జొన్న మున్నగువాని తలవెన్నులు తిన్నందున కడుపుబ్బిన పశువునకు, పాతజొన్నదంటును మసిగా కాల్చి ఆమసిని నీళ్ళతో కలిపి యియ్యవలెను.

క. కడుభరముగాగ నుబ్బిన
పెడసంధులరెట్టఁ గలిపి పెట్టుట నీటఁ
తొడిబడక మూఁడుగొట్టలు
కడువేగమె పెట్టినంత కదలక పారున్. 39

తాత్ప:—కడుపుబ్బినట్లయిన పక్షిరెట్ట నీటిలోగలిపి మూడు గొట్టములు త్రాగింపవలెను.

—♦ ఇరువాయిగట్టుటకు చికిత్స ♦—

క. ఇరువాయిగట్టి యూరుపు
విరియక నిగ్రహముఁ బొందవేగమె పసికిన్
గురువిందపసరు కలితో
నెరవుగఁ బెట్టంగ, గష్టము వేగమెపారున్. 40

తాత్ప:—ఇరువాయిగట్టి ఊపిరియాడకున్న పశువునకు గురివిందాకు పసరు కలితో గలిపి త్రాగింపవలెను.

—♦ చికిత్స ప్రమాణము ♦—

క. మిగులుగఁ బెట్టినప్రేగులు
తెగమారం గాలు పసికి తెలివిన్ గట్టం
సగమిడును చల్ల తంగెడు
చిగురును కలి నూరిపెట్ట చెచ్చెరమానున్. 41

తాత్ప:—పూర్వపద్యమందు వివరించినమందు అధికముగా నిచ్చినయెడల, పేగులుమాడునుగాన అరగొట్టముప్రమాణమిచ్చి చల్లతంగేడుచిగుళ్లు కలిపి నూరి యివ్వవలెను.

—♦ ఇంకొకవిధము ♦—

ఆ. కట్టుకొకనీరు కాచిన నీరుతో
బెట్టరాజనంపుపిండిఁ గలిపి
పిడకబూడ్దె యొండు కడుమెత్తఁగా తాల్చి
పాచినీళ్ళఁబెట్టు పసరమునకు. 42

తాత్ప:—వేడినీళ్ళతో కట్టివిడచినచీర నీళ్లు కలిపి రాజనవుపిండి, తాల్చినపిడకబూడిద పాచినీళ్ళతో కలిపి యివ్వవలెను.

—♦ వాతమునకు చికిత్స ♦—

క. దుష్టవుపవన రోకమానెడు
నిష్టతో వులికలియఁబెట్టు నేరువుతో నీ

స్పష్టముగ సోలె డమరగ
కష్టము పసరమునకుఁ బెట్ట కవుపృధి మగుఁగా. 43

తాత్ప:—మానెడు దుష్టుపాకరసము, సోలెడు పులి కడుగు కలిపియిచ్చిన పశువునకుఁగల వాతము హరించును.

సీ॥ ఒకర నాలుగుకా ళ్ళనూనంబుగావాచి
కదలనేరక చిరకాలమైన
దానికి వావిలి తంగేడు దిరిశన
బాడిత వేపాకు పసరు తెలసి
మానెడాముదమును మరినేయి నూనెయు
నందులోపలఁ గలియంగఁబోసి
కడుమెల్ల నన్నియుగాచి పొంగారంగ
పేరిమతోఁ దవ్వేడు పెట్టవలయు
వాతమెట్టిదైన వారక పదునాల్గు
దినము లిడిన తొంటి యెనుముకంటె
లావుగలిగి బ్రిదుకు గోవు కీక్రియఁ జేసి
రేని వాయువులును మానుచుండు. 44

తాత్ప:—నాల్గుకాళ్లును, అధికముగా వాచి కదలజాలని పశువునకు వావిలి, తంగేడు, దిరిశన, బాడిత, వేప వీనిఆకురసములతో మానెడాముదమును, నేయియు, నూనెయు, కలిపి తెల్లపొంగు వచ్చునదుక కాగబెట్టి తవ్వెడు చొప్పున త్రాగించినయెడల పదునాలుగు రోజులకు వాతము హరించి వెనుకటికన్న బలియును. ఆవులకును ఇట్లే చేయవచ్చును.

—♦ జంబుక వాతలక్షణము ♦—

ఉ. జంబుకవాతమైన పశుజాతికి దీర్ఘయుతంబులైన రో
మ బులుబుట్టి దానొడల మారుతమెప్పుడు మార్పనొంమన

గ్నింబడి మేయనోడు పరిసీడల దూరగజూచునట్టి రో
గంబు జనించెనేని బసికాళ్ళను బారఁగఁజూచు నోర్వకన్.

తాత్ప:—పశువులకు రోమములు పొడుగుగా బయలుదేరి ఎండ లో మేయలేక నీడలఁజేరుచు కాళ్ళు పారదన్నుచున్నచో అది జంబుక వాతముగా నెఱుఁగవలెను.

—♦ పైదానికి చికిత్స ♦—

చ. బిసరుహమూలముంబసపు బెండలవేళ్ళను నొక్కరూపుగా
వసుమతి శర్కరంగలిపి వారక కుమ్మిచు బందినేతిలో
మసలకవండి లేహ్యము క్రిమంబున గొఱ్ఱెలపాలతోడుతన్
బసరపు నక్కవాత మొకపక్షము బెట్టినమాను టేర్పడున్.

తాత్ప:— తామరదుంప, పసుపు, బెండలవేళ్ళు ఒకేప్రమాణ ముగా పంచదారతోఁ గలిపి కుమ్మి, పందినేతితో వండి ఆలేహ్యమును గొఱ్ఱెపాలతో పదిహేను దినములు పశువునకుఁ బెట్టినయెడల నక్క వాతముమానును.

—♦ తీ ట కు చి కి త్స ♦—

క. కలియును బూరుగ బంకయు
తిలకుసుమము వండిపెట్టఁ దీటలు మానున్
కలియును వెంపలి పసరును
వలనుగ గల్లుప్పు బెట్ట వాతము మానున్. 47

తాత్ప:—కలి, బూరుగుబంక, నువ్వుపూవు ఉడికించి పెట్టిన తీటలును; కలి వెంపలిపసరు, ఉప్పును కలిపిపెట్టిన వాతమును మానును.

ఆ. జొన్ననాము మేసి సొలసి యుంగిడిగొని,
తొట్రుపడ్డ పసికి దోరముగను
తద్విషంబుఁ జెరుప తెడయుక నల్లేరు
కొనలు దవడయందు జొనుపవలయు. 48

తాత్ప:—జొన్ననాము తిని, యలసిపోయి ఉంగిటఁబట్టి బాధప డుపశువునకు నల్లేరుచిగుళ్ళను దాడలలో నుంచవలెను.

—♦ తలతీటకు చికిత్స ♦—

సీ. పశువుల తలగాడి పలుమారు గోరాడ
కొనలెక్క తలకాయ గోకుకొనిన
తలమాదయగు నొండె* తలలోన తీటగాఁ
జనురోగ మగు నని కనుగొనుండు
ఆవాలు చవితెత్తు నమరంగ వెల్లులి
శొంఠియుఁ గాడిచేసి సొంపుమీర
గొలిమిడి పసరును గూర్చి కణముపులంను
నస్యంబుఁజేసి యనంతరంబ
కొనచెవుల్ రెండుకొమ్ములు గూడగట్ట
వాయు రోగము లెందును వేయునేల
జనులు సహదేవమతమును జదివి యెఱిగి
చేయుడీ మీరు సురభుల జీవరక్ష!

తాత్ప:—తలమీద పశువులు గోకుకొన్నచో అది తలమాదగా ని, తలలోని తీటగాని యగు నని గ్రహింపవలెను. వీనికి నాలుగుడబ్బుల ఎత్తు ఆవాలు, వెల్లుల్లి, శొంఠి ముద్దగానూరి గొలిమిడాకు పసరుతో కలిపి చెవులలోఁ బోసి కొనకొమ్ములకు చెవులకు గూడ కట్టవలెను. ఈస హదేవమతమెరిగి గోరక్షణ చేయవలెను.

—♦ అంగిటిముండ్లకు చికిత్స ♦—

క. మేపరదాకిన కుత్తుక
వావునకున్ గారముండ్లువడి నణచును నా
వావుకు కంఠము చూడిన
నాపసరంబునకు మాను నంగిటిముండ్లున్. 50

* తలమెఱియగునొండె అని పాఠాంతరము.

తాత్ప:—మేతమాని, కస్తుకవాది గారముండ్లు పడిన పశువునకు కంఠముపై చురకవేయవలెను.

—♦ ముక్కుబంతికి చికిత్స ♦—

క. ముకుబంతి తలకునెక్కిన
నొకకాలమునందుఁ బసర ముడుగగ దగ్గున్
ఒకపిల్లిగడ్డ యాసుర
భికి నస్యముఁజేయు దగ్గుబెక్కొని మానున్. 51

తాత్ప:—పశువునకు తలకు ముక్కుబంతియైనప్పుడు తరచుగా దగ్గును. అందుకు పిల్లిగడ్డ సగము చేసివేయవలెను.

—♦ వగర్పునకు చికిత్స ♦—

క. కలియును వెంపలిరసమును
గలుపుచు నస్యంబుసేయుగా దగ్గడగుఁ
గలియును మోదుగుపసరును
దిలపిష్టము బెట్ట వగర్పు దిరుగును పసికిన్. 52

తాత్ప:—కలి, వెంపలిపసరును కలిపి ముక్కుతోఁ పీల్చించినచో దగ్గు మానును. కలియు మోదుగపసరును తెలికపిండియు పెట్టిన వగర్పు తగ్గును.

—♦ గుండెవగర్పు, దగ్గుకు చికిత్స ♦—

క. ఇలవేముగడ్డరసమును
గలపగ నొకటొకటి నూరి కలితోఁ బెట్టన్
పొలుపుగ దగ్గు వగర్పును
వెలయంగా కుముటు మాను వేగమె పసికిన్. 53

తాత్ప:—నేలవేముగడ్డ ఒక్కొక్కటే కలితో నూరిపెట్టిన దగ్గు వగర్పు కుముటు శాంతినందును.

—♦ పుచ్చిన పుండుకు చికిత్స ♦—

క. పుచ్చినపుంటికి పురుగులు
చచ్చేటందులకు నుల్లిసహితము ఘృతమున్
వెచ్చంగఁ గాచిపోసిన
వెచ్చములే కేట్టిపుండు వేగము మానున్. 54

తాత్ప:—పుచ్చినపుండులోని పురుగులు చచ్చుటకై ఉల్లియు నేయియు కలిపి దంచి కాచి వేడిది పుండ్లమీద పోయవలెను.

—♦ పుండు తొలగుటకు చికిత్స ♦—

క. పసికాలుబెణికి తొలగిన
నెసఁగగ నక్కాలుపట్టి యీడ్చినదానిన్,
వెసఁ ద్రికటుకముల్ మొత్తల
బసికిన్ బూయఁగను పుండు బాగుగ మానున్. 55

తాత్ప:—పశువుకాలు బెణికినయెడల ఆకాలుబట్టియీడ్చి దాని మొత్తనమీద త్రికటుకములు పూయవలెను.

—♦ ఈచకాలికి చికిత్స ♦—

క. కాలెండి యీచఁబోయిన
పాలును చేగొణితియాకు పసరునుఁ గూడన్
కాలికి బూసియుఁ దోమిన
దేలును నటుకాలు సాగదీయఁగ వచ్చున్. 56

తాత్ప:—కాలు ఎండిపోయి సన్నమైనచో చేగొణితాకుపసరు, పాలు కాలికి పూసి తోమవలెను.

క. దానికి నిరువదిదినములు
గానిది మరిచక్కగాదు, కావునఁ బయికిన్
పోసిక కట్టిమేసినఁ
గానిదియగు కాలు తొంటి క్రమమునవచ్చున్. 57

తాత్ప:—పై విధముగా యిరువదిదినములుచికిత్సచేసినగాని యీచ కాలు నయముకాదు; గావున పశువుకు బయట తిరుగనీయక కట్టి మేప వలెను.

## —♦ విరిగినకాలుకు చికిత్స ♦—

చ. పసరముకాలు దా విరిగి పన్నగబోటునఁ బోవకుండినన్
నుసగగ వావిలిన్ మరియు మానెడుపాలు గలంగరాకు న
ప్పసరున వెన్నయున్ మినుముబొఁడిమినఁ జూర్ణముఁజేడువారముల్
విసువక కట్టిపెట్టు, మరి విర్గినకాలును పట్టుపాడుసన్. 58

తాత్ప:—పశువుకాలు విఱిగినచో వావిలాకురసమును, మానెడు పాలు, గుంటగలగరాకుపసరు, వెన్న, మినుపపిండి కలిపి ఏడువారములు కట్టుగట్టవలెను. విరిగినకాలు సైతమ్మతుకు కొనును.

## —♦ పోటుబోనందుకు చికిత్స ♦—

ఆ. పోటుబోయి విరిగి పొరిగాలుకుంటిన
నెముకఁ జక్కఁదోఁసి యేడునాళ్లు
ఎనుప నెయ్యిపాలు నెసగంగఁ బోసిన
నెముకకట్టి కాలి కేవువచ్చు. 59

తాత్ప:—పశువుపోటుబోయి కుంటినచో ఎముకను సరిగాసవరిం చి ఏడుదినములు గేదెనేయి, పాలు పోయవలయును.

## —♦ నరముతెగినందుకు చికిత్స ♦—

చ. నరములు తెగ్గివ్వ దుంపగల నల్లనినీలియుఁ దిప్పతీవయున్
గురుతరమైన యాతరువు గుంపెనమూలముచర్మచూర్ణమున్
సురభికి వెన్నతోఁగలిపి, సుస్థితిఁ బెట్టిన పుట్టబూసినన్
ఇరువదినాళ్ళయాతుదకు నేర్పడవచ్చు నరంబులన్నియున్.

తాత్ప:—పశువుసరములు తెగినయెడల నీలిదుంప, తిప్పతీగె, గుంపెనచెట్టువేరు బెరడును ఇవి చూర్ణము గావించి వెన్నతూకలిపి పెట్టవలెను. ఇరువదిదినములకు సరము లతుకుకొనును.

—♦ కాలికుంటునకు చికిత్స ♦—

ఆ. కుంటు తెవులు తగిలి గోపదేల్పసికిని
కొలఁది జల్లెడుననకొనలు విరిచి
ముక్కు గోళ్ళలోన నెక్కించియుంచిన
కుంటు తెవులుబోయి కూర్మి నెసగు 61

తాత్ప: కుంటురోగము వచ్చి బాధపడు పశువునకు కొంచెముగా జల్లెడుపూలకొనలు విఱచి ముక్కుపుటములలోన ఎక్కించవలెను.

—♦ గాలిదగ్గులకుండుటకు ♦—

క. తైలంబు కోదధ్రివాన్నము
మూలిమితో నేడుమార్లు మంత్రించియు గో
జాలంబులకునుఁ బెట్టిన
నాలకుఁ గాళ్ళంట వుదు రార్యజనంబుల్. 62

తాత్ప:—భూతము సోకిన పశువులకు నూనె, ఆరెఅన్నము కలిపి ఏడుసార్లు క్రిందిమంత్రమును జపించుచు మంత్రించి పెట్టవలెను.

—♦ మంత్రము ♦—

శ్లో. ఘంటాకర్ణమహాఘోర ♦ సర్వవ్యాధిభయంకర
ఖురరోగవినాశాయ ♦ రక్షరక్షమహాబల. 63

—♦ మెత్తగాళ్ళకు చికిత్స ♦—

క. కరకపాడి క్రొత్తసున్నము
మరి పులుకండములతోడ మర్దించియుగో
వరికాలఁబెట్టి కాచిన
స్థిరముగ నామెత్తగాళ్ళు తేజమునందుఁ. 64

తాత్ప:—కరక్కాయచూర్ణము, కొత్తిసున్నము, కలకండ మెత్తగానూరి ఆవు అరకాలిలోపెట్టి కాచిన మెత్తగాళ్ళు మానును.

—♦ కురుమకులక్షణము ♦—

క. నాలుగు కాళ్లును నిలువక
నేలను దొర్లిగలి మేతనీళ్ళును దొలఁగన్
సోలున్ జులుకగ లేవదు
గోలును కడుపుబ్బరించు కురుము గుణంబుల్. 64

తాత్ప:—నాలుగుకాళ్లు నేలపై నిలువఁబడక తోట్రుపాటుపడు చునీరు మేత వదలి సొలి తేలికగా లేవక ముడ్డిపూసయు కడుపును ఉబ్బ రించినయెడల కురుమరోగ మని తెలిసికొనవలెను.

—♦ చికిత్స ♦—

ఆ. కురముఁగొన్నపసికి నరయ దుష్టువుతీగె
గాడిదెముకఁగూర్చి కట్టి యెడమ
తలను గదియ పిడకవెలిమిడీ తగఁబూయ
నాలకురుమ తెగులు నణఁగిపోవు. 66

తాత్ప:—దుష్టువుతీగ, గాడిదఎముక, కలియగట్టి ఎడమ ప్రక్క నపిడకబూడెద రాచినచో కురమరోగము శాంతించును.

—♦ ఇంకొక చికిత్స ♦—

క. అది దొరకకుండెనేనియు
నదనున కొక చెప్పుతట్ట యావడతీగన్
పదిలముగ గుచ్చికట్టియు
సదమలముగఁ బిడకబూడ్దె చల్లిన మానున్. 67

తాత్ప:—పైవస్తువులు దొరుకనియెడల చెప్పుతట్టను చేదుబీర తీగకు గుచ్చి పిడకబూడిదతో పశువునకుఁ గట్టవలెను.

—♦ చండికాలికి చికిత్స ♦—

ఆ. చండికాలియెద్దు సరిముందు కుంటిన
పెద్దగాలిగోరు వీడువడగ
నెత్తురుబ్బగొట్టి నీరుతోఁ దోమిన
చండికాలికుంటు చక్కనగును 68

తాత్ప:—ఎద్దునకు చండికాలువుట్టి, ముందరికాలు కుంటుగా నుండి, పెద్దగోరు ఊడిపోయినచో రక్తమువచ్చునట్లు నలగకొట్టి నీళ్ళతో తోమవలెను.

—♦ మణువుకాలికి చికిత్స ♦—

క. పసరంబు కాలిమణువుకు
నిరుగడ నేనంగుళములు నిక్కవచుట్టుకా
అరయగ చూడినఁగాదే
నురుచిరముగ నక్కదుగ్ధసూతము గట్టుకా. 69

తాత్ప:—పశువుకాలు మెత్తబడి మణిగినప్పుడు కాల్చవలెను.

—♦ సాధారణ రోగములు ♦—

గీ. దూల నేరెడు గలిజేరు మూలము వస
కొమ్ము మిరియములను గూడి నెమ్మితోడ
మెత్తగానూరి కన్నులమీదఁ బెట్ట
గాను పసుల తెవుళ్లను మానువేగ. 70

తాత్ప:—దూలగొండి, నేరేడు, గలిజేరువేళ్ళు, వసకొమ్ము, మిరియములు మెత్తగానూరి కళ్ళమీద కట్టవలెను.

—♦ శలతెవులుకు చికిత్స ♦—

క. శలతెవులు దాకి చిక్కిన
గలితో నీమందు నూరి కన్నుల నిడినకా

కలపిడచి రేలయాకును
నలయగ పొగబెట్ట రోగమంతటమానున్. 71

తాత్ప:—శలరోగముగల్గి చిక్కిపోయిన పశువునకు పైన చెప్పిన మందు నూరి కండ్లకు కలికమువేసి రేలాకు పొగచేయవలెను.

—♦ ఇంకొక చికిత్స ♦—

క. శలతెవులు దాకు పసికిని
కలియంగా నొడలినిండ గన్నులనిండన్
సిలివిడియాకుచు పసికిని
గలయఁగ పొగఁబెట్ట మానుఁగడుశీఘ్రముగన్.

తాత్ప:—శలరోగము వచ్చిన పశువునకు ఒంటినిండా కండ్లనిండా రేలాకుపొగ వేయవలెను.

—♦ ఈదుపులికి చికిత్స ♦—

ఆ. ఈదుపులియుఁ దాని యిరుగాళ్లు వీపును
రాకయుక్క పసికి రావిచెక్క
మరియు బచ్చిపాలు మఱువక నాల్నాళ్ళు
గొట్టిడేసి పెట్ట గోవు లేచు. 73

తాత్ప:—ఈదుపులి పుట్టినగొడ్డు కాళ్ళు, వీపు సాగని యెడల రావిచెక్క పచ్చిపాలు నాలుగుదినములు రోజున కొకగొట్టముగా యీయవలెను.

—♦ కల్లవాపుకు చికిత్స ♦—

ఆ. కల్లవాపు పసికి గడువాచెనేనియు
చుట్టు వాతఁబెట్టి మట్టుగాను
కాలగంప పాలు కలియంగ బోసియు
బాయ వాపు మానిపోవుఁ బసికి. 74

తాత్ప:—కల్లవాపునకు ఆవాపుచుట్టును వాతవేసి, ఆవుపేడ, పాలు కలిపి వాపుమీద పూయవలెను.

ఆ. వావిలాకుపసరు వల్మీకమును గల్పి
పైని బూయ వావు పసికి మాను
వేగఁ జేయవలయు బాగుగా నప్పాకు
కుమురుఁ గల్లవావు గోవులకును. 75

తాత్ప:—కల్లవాపుకు పుట్టమన్నుతో వావిలిపసరుకలిపి ఒడలికి పూయవలెను,

—♦ తిక్కరోగములకు ♦—

ఆ. తిక్క తెవులుగాక తిరముగా శృంగముల్
కొనలయందు మఱుగుకోక చుట్టి
నూనెదడిసి కనులు గానకుండఁగఁ గట్టి
దివియలెత్త గడియఁ దీరుతిక్క. 76

తాత్ప:—తిక్కరోగమునకు పశువుకొమ్ముల చివర నూనెగుడ్డ చుట్టి కండ్లు గనబడకుండ గంతలుగట్టి దీపములు వెలిగించవలెను.

—♦ కామెలకు చికిత్స ♦—

ఉ. కన్నులు వాచి తోయములు గారినయంత మరీచి పిప్పలీ
నున్నగ నూరిపెట్టు డొక న్యూనతపుట్టదు, కామెలైనయా
కన్నుల గుంటకల్లసము కాటుకబట్టియు తద్రసంబుతో
గన్నులఁబెట్టగా సిలకకామెలు మాను దినాష్టకంబునన్. 77

తాత్ప:—కండ్లువాచి నీరుగారుచు కామెలవ్యాధి వచ్చెనేని మిరియాలు పిప్పళ్లునూరి కలికము వేయవలెను.

—♦ కండ్లు నీరుగమ్ముటకు ♦—

క. పులుగుడుమూలము గోపియు
జలములతో గూడ నూచి చక్షుల నిడినన్
పలుమరు నీరుంగారుట
వెలనొప్పియు బసరమునకు వేగమె మానుఁ. 78

తాత్ప:—గోగి, పులుగుడుపువేరు నీళ్లతో అరగదీసి కలికమువేసిన గొడ్డుకళ్లకు నీరుగ్రమ్ముట మానును.

—♦ ఇంకొకవిధము ♦—

ఆ. నీడఁగట్టి మేపు నీళ్ళను బెట్టుచు
పదిదినాలు సురభి వదల కరసి
రేపుమాపు కంటిలోపల చౌరమిాను
రెట్టయిడిన చెడినదృష్టి వచ్చు. 79

తాత్ప:—దృష్టి చెడినయెడలి నీడలో గట్టివేసి మేత, నీళ్లు పెట్టుచు పదిరోజులు సొరచేపమలము కంటిలో పెట్టవలెను.

—♦ మరియొకచికిత్స ♦—

ఆ. అందుబోకయున్న దుందిలదళముల
పసరుతో మరీచి దళకచూర్ణ
మలవరించి పువ్వుగల యావుకంటిలోఁ
బోయ నారునెలల పువ్వు మాను. 80

తాత్ప:—వెనుక చెప్పిన మందుతో మాననియెడల దుందిలపాకు పసరుతో పదిమిరియాలు అరగదీసి కంటిలోఁబెట్టిన పూవువేసిన కళ్ళను నయమగును.

—♦ వేరొకచికిత్స ♦—

క. ఆరెదొండాకు మిరియము
క్షీరంబును పోసి నూరి క్రియతోఁ బసికి
నేరుపుతోఁ గన్నుల నిడఁ
గోరిక పదిదినములకునుఁ గుదురును పసికిన్. 81

తాత్ప:— ఆరెదొండాకు మిరియము పాలతో కసిపినూరి కళ్ళకు వేసిన పదిరోజులలో నేత్రబాధ మానును.

ఇంకొక చికిత్స

క. విచ్చలవిడిఁ బసరంబున
కిచ్చకురా మేపుబెట్టి యిరుమూరు ఘృతం
బచ్చుగఁబెట్టిన నయముగ
వచ్చుం బదిదినములకు నవారిత దృష్టిన్. 82

తాత్ప:—పశువును విచ్చలవిడిగా మేపి రోజుకు రెండుసార్లు నేతిని కళ్ళలో వేసినచో దృష్టి తిన్ననగును.

—♦ అవిరికి చికిత్స ♦—

అ. పేరియున్ననెయ్యి పెంచిక పొడియును
అవిరె పెరిగెనేని యరఁటిపసరు
మూవు కంటిలోన మూఁవుక బెట్టిన
నేనుతిధులకెల్ల మానుఁ బసికి. 83

తాత్ప:—పశువునకు అవిరెపెరిగినట్లయిన పేరిననేయి, కుండపెంకు పొడుము, అంటిదుంపరసము రాత్రివేళలందు తప్పక పెట్టుచున్నయెడల అయిదురోజులలో కంటిలోబాధ నివారణమగును.

—♦ పువ్వులకు వైద్యము ♦—

క. దిరిశెన పువ్వులరసమును
మిరియంబునుఁ గలయనూరి మెదిపినపట్టక్
ఇరువుగ నాలుగుప్రాటలు
విరసపుచెవిఁ బిడువపువ్వు వేగమె మానున్. 84

తాత్ప:—కన్నులలో పువ్వులువేసినయెడల దిరిశెనపూవుల రసముమిరియము కలిపి నూరి, నాల్గుపూటలు కుడికన్నైన ఎడమచెవిలోను, ఎడమకన్నైన కుడిచెవిలోను పోయవలెను.

—♦ ఇంకొక విధము ♦—

క. పసికంట పువ్వుబుట్టిన
మనలక దొండాకుపసరు మరిచము రెండున్

పోసగంగ నూరి కన్నుల
వెసఁబెట్టిన పువ్వులెల్ల వేగమె మానున్. 85

తాత్ప:—దొండాకురసమును మిరియాలును నూరి కన్నులలో పెట్టవలెను.

—♦ నిలువుకంప్లకు ♦—

క. నిలువులు బడినను తొమ్మిది
నెలలైనను వచ్చుజుమ్మ నెరయగ ముత్సం
ధులమీద రెండువాతలు
తెలియంగాఁ బెట్టిరేని దృష్టులు వచ్చున్. 86

తాత్ప:—నిలువుకంప్లు బడినచో తొమ్మిదినెలలు దాటినను ముత్సంధులమీదను రెండువాతలు పెట్టవలెను.

—♦ గువ్వరోగమునకు ♦—

క. గువ్వతెగులైన పసికిని
వివ్వను వాలంబుగుత్తివెండ్రుక లూడన్
మువ్వముచెదుఁ గదుబెగడును
క్రొవ్విడి వెడగుండలగుచు గుందుచుఁ దిరుగున్. 87

తాత్ప:—తోకవెండ్రుక లూడిపోవునట్లు వినరుకొనుచు పశువు తిరుగుచుండెనేని అది గువ్వతెగులుగా తెలియవలెను.

సీ. ఈగువ్వరోగంబు వేగమెమాన్పంగఁ
గలమందమట్టలు కడువదెచ్చి
కల్లుప్పు నావాలు నల్లంబునమముగ
గూడంగ నన్నియు గ్రుమ్మపెట్టి
పుల్లకడుగులోన బోసియామందులు
మురుగంగనిచ్చుచు మూడుతిథులు

పసికిఁబెట్టుచునుండి బడవాఁరిలిపడునట్టి
తోఁకగురుసు మరి దునిమివైచి
వేఁడినేతిలోన వెలయంగఁ గొనదోఁకఁ
బెట్టి విడిచెనేని గొట్టెడేసి
మందుబెట్టెనేని మానును సహదేవు
మతము తోఁకగురుసుమందు లివియ. 88

తాత్ప:—కలబందమట్టలు, రాతిప్పు, ఆవాలు, అల్లము సమ భాగాలు కలిపి వుల్లకలిలో వేసి మూఁడునాళ్ళునురిగించి తోఁకగురుసు రోగముపుట్టిన పశువునకు తోఁకను రోగమున్న భాగము ఖండించి నేతిలో ముంచి పై మందునుపూటకు గొట్టుప్రమాణ మిచ్చినచో తోఁకగురుసు అను రోగము నివారించును.

—♦ చూ లు ని లు వ బ డు ట కు ♦—

ఆ. అడవితుమ్మగింజ కడుమెత్తగానూరి
వెన్నతోడ నెనుపకన్నులకునుఁ
బన్నుగాను బెట్ట పదియారుదినములు
చూలువడ్డలకును చూలు నిలుచు. 89

తాత్ప:—అడవితుమ్మగింజలు వెన్నతోనూరి పదునారు రోజులు కలికమువేసిన యెడల పశువులకు చూలునిలువఁబడును.

క. ఆకు కరివేముబెట్టిన
నాకొడెలు లావుగల్గు నాబెయ్యలకున్
చేకొని యీక్రియఁ జేసినఁ
బ్రాకటముగ చూలు పాలపండ్లన నిలుచున్. 90

తాత్ప:—పెయ్యలకు కరివేపాకు పెట్టినయెడలపాలవండ్లప్రాయ మందేచూలు నిలచును.

—♦నెలతక్కువగా ఈనినపశువునకు చికిత్స♦—

క. కొరనెల నీనిన పశువుకు
దురిమిడియును, వెదురటాకు ద్రొపంగఁజేయున్
దరి నీనలేని దానికిఁ
గురులున్ వెదురాకు మేప గొబ్బున నీనున్. 91

తా॥ నెలతక్కువగా యీనిన పశువునకు దురిమిడాకు, వెదురాకు పెట్టిన బాగుపడును. ప్రసవింపక బాధపడు పశువునకు తలవెండ్రుకలును, వెదురాకును మేపిన శీఘ్ర ప్రసవమగును.

క. ఆలేగ నొక్కమాసమ్ము
గాలినిఁ దడవుండ నీక కప్పుచు నాసన్
పాలుదుగు పెక్కుగుడువక
చాలినక్రియ వెన్నఁబెట్ట చావక బ్రదుకున్. 92

తా॥ పైవిధముగా పుట్టిన నెలతక్కువలేగను ఒక నెల పర్యంతము గాలితగులనీయక చాటుననుంచి విశేషముగా పాలు గుడువనీయక తగినంతవెన్న బెట్టినచో చావక బ్రదుకును.

♦— పా లు చే పు ట కు మ ం దు.

ఆ. కట్టనీక పొంచి కదుప్రకేపునొల్లక
మసల పితుకనీని పసికినయిన
పుల్లతీఁగ బొదలబూసి నాదించిన
పితుకనిచ్చు నెట్టి మొదవుతైన. 93

తా॥ కట్టనియ్యక పొడుచుచు దూడను జేరనీయక పిదుకనీయని పశువులకు పొదుగున పుల్లఁతీగఁబూసి పొదుగుపైఁ గొట్టిన ఎట్టి పశువులైనను పిదుకనిచ్చును.

—♦ మా వి షి న్న దా ని కి ♦—

క. తనమావి వయిచి మేపిన
ననుములునుం బచ్చిపుచ్చ యాకురసంబున్.

వినుచల్లఁ గలిపిపెట్టిన
తనమెదలో మావికరిగి తప్పక చేవుఁగా. 94

తా॥ తన మావి తానే తిన్న పశువునకు అనుములు పచ్చివుచ్చా కరసము చల్లతో బెట్టినచో మావి లోపలిది లోపటనె కరిగిపోయి పాలుపడును.

—♦ తొలిచూలి దోష్యమునకు చికిత్స ♦—

ఆ. వెలది పులిగంటి నెయ్యిని
వులకండము పాలు నాల్గుపూటలు బెట్టన్
తొలిచూలువశ్వ యొడలునఁ
గల క్రౌర్యంబెల్ల మాను, గశ్రిక్క నజేవున్. 95

తా॥ ఆడుపులినేయి కలకండ పాలు నాల్గుపూట లిచ్చినయెడల ఆవు తొలిచూలి దుర్మార్గ మణగి చేవును.

—♦ దూడను మరుగుటకు ♦—

క. చల్లయును తాడికాయలు
కల్లువ్వను జీలకర్ర సుగంధియుఁ బోయఁగా
తొల్లి తన కేపునుండఁగ
నొల్లనియది యైనఁ * బాయకుండును ధాత్రిన్. 96

తా॥ తాడికాయలు, చల్ల, సైంధవలవణము, జీలకర్ర, సుగంధి నూరిపోసినయెడల దూడనొల్లని యావైనను వెంటనే మచ్చికపడును.

—♦ పాలిచ్చుటకు చికిత్స ♦—

క. నెయ్యియు గోధుమగంజియుఁ
బొయ్యుచు సురభులకు నాల్గువూటలు దానన్
గయ్యాళిపసరమైనను
పెయ్యికరచి పంచటిలుచుఁ బితుకఁగ నిచ్చున్. 97

* పాయకుండనె యుండున్ అని పాఠాంతరము.

తా॥ నేయి, గోధుమగంజి పోసినయెడల గయ్యాళియావైనను దూడకొఱకరచి పాలు పితుకనిచ్చును.

—♦ ఆవుచేపుటకు చికిత్స ♦—

క. అడ్డసరపాకు మలిమిడి
గడ్డయుఁ గల్లుప్పు జీలకఱ్ఱ సుగంధిన్
పడ్డకుఁ బోయఁగ నేవున
అడ్డము పులిచల్లతోడ నది దిని చేపున్, 98.

తా॥ అడ్డసరపాకు, మలిమిడిగడ్డ, సైంధవలవణము, సుగంధిపాల అడ్డెడుచల్లతో బెట్టినయెడల ఆవు బాగుగా చేపును.

—♦ చూలునిలువనిచో చికిత్స ♦—

ఆ. ఫలముగానిగొడ్డు ఫలమీయు బాపర
పండురసము పచ్చిపాలతోడఁ
బెట్టినపుడు కలయఁబెట్టి మేకలనెయ్యి
బెట్ట నిల్చు చూలు సెట్టిపసికి. 99

తాత్ప:—చూలు నిలువని పశువులకు పాపరపండు రసము, పచ్చిపాలు మేకనేతితోఁ గలిపి యిచ్చినచో చూలునిలుచును.

—♦ దూడను మఱగనిదానికి ♦—

ఆ. ఈని పెయ్య నర్మిలింపఁగ లేకనుఁ
గుడువనీక దూడ పొడిచెనేని
గోవులకును కొండగోగు రసంబును
నొడలఁ బూయ కోర్కెఁ గుడువనిచ్చు. 100

తాత్ప:ఈని దూడపై ప్రీతిలేక పాలీయక పొడుచునట్టి పశువు శరీరమునకు కొండగోగులరసము రాచినయెడల తప్పక పాలిచ్చును.

—♦ చేపనిపశువులకు ♦—

క. వలుసగ చేగొండాకును
నెలియావలు, జీలకఱ్ఱ విను కల్లుప్పున్

పులిచల్లఁ గలిపి పెట్టిన
వెలయుచుఁబసరంబు చేవు; వేగమె తరిలోఁ. 101

తాత్ప:—చేగొణిదాకు, తెల్లఆవాలు, జీలకర్ర రాతిఉప్పు పులిచల్లతో కలిపి పశువునకు బెట్టినచో అద్భుతముగా పాలుపడును.

క. ఆయాకును స్వీయంబగు
తోయంబునుఁ బచ్చిపసపుతో మిరియంబున్
చేయుచు ముక్కున నస్యము
జేయఁగ పసరంబు జేవు శీఘ్రమె తరిలోఁ. 102

తా॥ చేగొణి దాకురసము మిరియాలు, పచ్చిపసుపు ఆవుపంచితముతో కలిపి నస్యముచేసి పీల్పించినయెడల త్వరగా చేవును.

ఆ. కన్నెకొమరితీవెగడ్డతో నల విరి
గాకు నూరి ముద్దగారవమున
* నువ్వుపిండిని దనువున బుయ్యంగను
గుడువనియని పసికి † గుణము వచ్చు. 103

తా॥ కన్నెకొమరితీగె దుంపతో విరిగాకుముద్దగా నూరినువ్వులపిండితో గలిపి ఒంటికి పూసినట్లయిన పశువు దూడను గుడువనిచ్చును.

—♦ ఇం కొ క చి కి త్స ♦—

క. గడియయు పొద్దుండఁగ నా
పిడియంబుచ్చుచును వేగ ప్రేమనునవు డ
ప్పిడియఁ గలరసము క్రోవున
కొడల బులిమి నాకనియ్య నొగిగొన జేవుఁ. 104

తాత్ప:—జాము పొద్దుండఁగా పశువు కరిలో చేయిపెట్టి ఆచేతిని దూడయొంటికిరాచి ఆవుచే నాకించినయెడల పాలుపడును.

---

* నువ్వుపిండి గలిపి యొడల, అనియును:

† గుణముసోకు అనియును పాఠాంతరములు

—♦ వే ఔ్ క చి కి త్స ♦—

క: తొలిచూలుపడ్డ కడువక
జలికేవడి దూడ కరచి చేపక యున్నన్ ‡
ఉలిమిడి యుసిరిక మినుములఁ
కలితోడను నూరిపోయఁ గ్రక్కునచేపుఁ. 105

తాత్ప:—తొలిచూలుపడ్డ దూడను చూచి అరచిచేపని మొదల ఉలిమిరి, ఉసిరిక, మినుములు కడుగుతో నూరిపోయవలెను. బాగుగాచేపును.

—♦ మ రి యొ క చి కి త్స ♦—

క. పులికందం బావాలును
తలతాళపుగడ్డ గోఘృతమును దురద గొం
డుల విత్తనముల చూర్ణము,
గలుపుచు కుంచెడునుఁ బెట్టగా బసి చేపున్. 106

తాత్ప:—కలకండ, ఆవాలు, నేలతాడిదుంప, ఆవునేయి దురద గొండిగింజలు వీనిచూర్ణమును కలిపి కుంచెడుపెట్టిన బాగాచేపును.

—♦ ఇ ం కొ క చి కి త్స ♦—

క. మందునుఁ బెట్టెడు నప్పుడు
పొందొడఁ బడమొడలుచేతఁ బుణుకుచు ననయం
బుం దగఁబెట్టిన గైకొని
నందడిదోఁచినను కూర్మి జేపవు పశువుల్. 107

తాత్ప॥మందు పశువున కిచ్చునప్పుడు నెమ్మదిగా మచ్చికచేసికొని దేహమును పుణుకుచు మంచితనముగ సందడి లేకుండ పెట్టినచోచేపును.

---

‡ ఇందుయతిదోషము కనబడుచున్నది "జనికేవలిదూడ కరిచేపక యున్నఁ" అను పాఠాంతరముగూడ గలదు. పాఠాంతర ప్రకారముగ యతిప్రాసలకు రెంటికిని దోషము పట్టుచున్నది. అర్థము కష్టగ్రాహ్యము.

### —♦ దృష్టి దోషము నపాయెందుటకు ♦—

క. మును పితికి పితికి కలుచయు
గునిపినచో నయముఁజేసికొనవలె పసికిన్
అనువుగ దృష్టియుఁదీసిన
ఘనతరముగ పాలు చాలగలుగఁగ నిచ్చున్. 108

తాత్ప:—పాలుకొన్నాళ్ళిచ్చి ఎగవేసినయెడల దృష్టి తీసినచో తిరిగి చాలా పాలిచ్చును.

### —♦ ఇంకొక విధము ♦—

ఉ. నిప్పులమీఁద జొన్నలును నింబదళంబులు ప్రత్తిగింజలున్
ఉప్పును వైచెనేని మొదలొప్పును పాడియునిచ్చు నిత్యమున్
తప్పకజూచిమోహమున దానిఁగనుంచెనువానికన్నులన్
నిప్పులువేగుచున్నగ్ని నేగుచుఁబోవును; వేగునంతకున్.

తాత్ప:—నిప్పులపై జొన్నలు, వేపయిగుళ్లు, ప్రత్తిగింజలు, ఉప్పు దిగదుడిచిపోసిన యెడల పశువును దృష్టి కండ్లతో చూచినవాని కండ్లలో నిప్పులు పోసినట్లే ఈవస్తువులుకాలి దృష్టిదోషమణగును.

### —♦ ఈనుటకిబ్బంది పడు పశువులకు ♦—

ఆ. ఈనలేక తినుకుదానికి గురివెంద
వేరు కలియుబోసి నూరి కడుపు
కరినిఁ బూయ దడవుగాకుండ వేగమే
యవుడు క్రొవ్వు విడుచు ననువుమీర. 110

తాత్ప: —గురివెందవేరు కలితోనూరి కడుపుమీదను కరికినిపూసి నయెడల సులభముగా ఈనలేక మూల్గుచుండిన పశువు ఈనును.

.ఉ ఈనిన చిన్నకోడెలకు ఈసినవారము పేరుబెట్టినన్
బూనఁగనోవుభారమునుఁబొందుగఁ గంఠమునందు కాడిడన్

దానఁజలింప దింపకయుదప్పియు జెమ్మట లేక దిమ్మరున్
మానుగనొక్క రూపునను మత్తతయెక్కినయెద్దుతానగుః.

తాత్ప:—దూడపుట్టినవారముపేరే దూడకు బెట్టినట్లయిన మెడ పయి నెంతబరువైనను మోయును. భుజమున కాడివేయ ఎంతమాత్రము లక్ష్యపెట్టదు. చలింపక చెమ్మటలేక మదించిన ఎద్దువలే లాగును.

—♦ గజ్జి తీటకు చికిత్స —♦

ఆ. తమ్మిగడ్డతోడ, నుమ్మెత్తవిత్తులు
దుష్టుపాకురసముతోడఁ గూడ
పశుల యొడలబూసి, పాయకకడిగిన
దినదినానఁ గజ్జి తీరిపోవు. 112

తాత్ప:— తామరదుంప, ఉమ్మెత్తగింజలుదుష్టుపాకు పసరుతో కలిపిపశువుల యొడలఁబూసినయెడల గజ్జినివారించును.

—♦ దురదకుమందు ♦—

క. పెయ్యలగజ్జికి వేగమె
పొయ్యెడు కామంచిపసరు పొలుపుగ దానికిఁ
పుయ్య నొకదినములోపల
వెయ్యియు మరియేల తీటవేగమె మానున్. 113

తాత్ప:—దూడలకు గజ్జపట్టినచో కామంచిపసరు దానిదేహమున పూసినట్లయిన మానును.

—♦ మరియొక విధము ♦—

ఆ. చలిమిడాకునూరి కలిమీద తెప్పలు
నుదధిలవణసహిత మొడల బూసి
మూడుతిధులుఁగడుగ మునుకొని లేగల
తీటవుండుమాని తెలివినొందు.

తాత్ప:— చలిమిడాకునూరి కలిమీదితరక ఉప్పు కలిపి మూడుదినములు దూడల దేహమునకు పూయవలెను.

## —♦ మావి పడుటకు చికిత్స ♦—

ఆ. ఈని మావివేయలేని పశువు కెల్ల
నసుపకకట్టు పుచ్చయాకురసము
వేలపిండితోడఁ బెట్టుడు; కాదేని
మరుగు చుట్టు పుట్ట మదుపవలయు. 115

తాత్ప:—ఈని మావినివేయలేని పశువులకు అనపగింజలకట్టు పుచ్చ ఆకులరసము వేలపిండి కలిపిండి కలిపి యిచ్చి మలుగుచుట్టును పుట్టమన్ను పూయవలెను.

## —♦ బలహీన పశువునకు చికిత్స ♦—

ఉ. పక్కలుబట్టి కావునకుబాపియు పెండ్రికమేడఁ బెట్టినన్
చెక్కలవేము కారుమ్మునగచిత్రిము జిల్లెడుగూడ నేలవే
ముక్కసమంబు చల్లయును నొప్పగగొట్టెడుచేసి మెత్తగా
దొక్కిడ నేడువారములుదొడ్డపడున్ పసిమేవుపెంపునన్.

తాత్ప:—పక్కలు నొప్పులెత్తి మందలోనికి చేరక పేడలోన పెండ్రికలువిడచు పశువునకు వేప, కారుమునగ, చిత్రమూలము, జిల్లేడు, నేలవేము వీనిచెక్కలుసమాంశములుగ చల్లతో మర్దనచేసి ప్రతిదినము ఒక్కొకగొట్టముగా ఏడుదినములు పోయవలెను.

క. దున్నక బెరికెకు డస్సియు
నున్న సురభి నల్లబడిన నొగి తెలపిష్టం
బన్నమునుఁ గలిపి పెట్టినఁ
బన్నుగ బదియేను తిథుల బడలికదీరున్. 117

తాత్ప:—దున్నుటకుమోతకు బలముచాలక నల్లబడిన చర్మము గల ఎద్దునకు తెలకపిండి అన్నము కలిపి పదునైదుదినములు పెట్టవలెను.

—♦ అబ్బుపుంటికి ♦—

క. మెడచుట్టు నలితిపుండై
పడగను పసరంబుగూడ బహుచోట్లఁ దగుల్
తడిబూడ్దె మెదిపి పూయఁగఁ
గడువేగమె తేరి పుండు గంట్లును మానున్. 118

తాత్ప:—మెడచుట్టును పుండుపడి బాధనందు పశువునకు తడిబూడిద మెదిపి పూసినచో పుండ్లు మానును.

—♦ పోట్లగొడ్డుకు ♦—

క. తోలఁ బడిబాదుచూ పసరము
కాలస్యము లేక దానియక్షులు రెంటన్
తైలముఁ బెట్టిన నేమది
నాలకు శాంతతకు వచ్చు నాబోతైనన్. 119

తాత్ప:—వెంటబడి పొడుచు స్వభావముగల ఆబోతుకన్నులలో నూనెవేసినట్లయిన ఒకవారము దినములకు శాంత స్థితికి వచ్చును.

—♦ పుప్పిపంటికి ♦—

సీ. వారిజపాకను నీరధిలవణంబు
మిరియంబుపొడి ధార మెదపిపెట్టు
కాదేవి గాడిదగడపాకు మిరియంబుఁ
గూడి కల్లుప్పునుఁ గూడఁబెట్టు
సమకూడదామెనా జను క్రొత్తసున్నంబు
నాముదమును గల్పి యవుదుబెట్టు
కరిదూవము సొరాకు కలితరాసున్నంబు
పొట్లాకు నూగునుఁ బొసఁగబెట్టు

మరియు తంబాకు బెట్టిన మానునవుడు
చెట్టుదీసిన వేగంబె నట్టు లేక
ప్రీత క్రొత్తవుడైనను ఖ్యాతితోడ
పుప్పివుండును మానును పురుగుచచ్చు. 120

తాత్ప:—బాడిదారు, ఉప్పు, మిరియాలపొడి, గుమ్మపాలు వేసిన పుప్పిపన్ను నయమగును. పై వస్తువులు దొరకనిచో మిరియము, సైంధవ లవణము కలిపి పెట్టవచ్చును. ఇదినమకూడనిచో క్రొత్తసున్నము, ఆము దము లేక కరిధూపను, ఆనపాకు, రాతిసున్నము, పొట్లాకునూగు, పొగాకు పెట్టవలెను. చెట్లు తిరుగవేయవలెను. పురుగులు చచ్చి పుప్పిమానును.

—♦ పొదుగు పుచ్చుటకు ♦—

ఆ. పొనఁగ నావుపొదుగు పుచ్చిన త్వరితము
సూర్యరశ్మిపాలు చూపిచల్లు
ఉత్తరేణియాకు మెత్తఁగా వెల్లుల్లి
నూరి జలధియుప్పు మేరమీర
మిరియములునుఁ గూర్చి మెదిపిపెట్టిన పుర్వు
వుండులోనఁ జచ్చు; పుండుమాను. 121

తాత్ప:—పొదుగుపుచ్చిన ఆవుకు ఆయావుపాలే పిదికి అవి సూర్య రశ్మికి చూపి చల్లివేయ వలెను. ఉత్తరేణిఆకు, వెల్లుల్లి, ఉప్పు, మిరియాలు నూరి పెట్టిన పురుగులుచచ్చి పుండు నయమౌను.

క. కాకులుపొడువక యుండఁగ
మూకొని యుండంగ నీగ ముసరక యుండన్
నాకక యుండగ వేగమె
చేకొని యరయంగ పుండు శీఘ్రమెమానున్. 122

తాత్ప:—కాకులుపొడువకుండ, ఈగలుముసరకుండ, ఆవు పుండు నునాకకుండగ జాగ్రత్తగా కాపాడినచో త్వరలో పుండుమానును.

## —♦ వగర్పు ♦—

చ. తనువగరయ్యెనేని బసి తాపమునంబడు నెండదాకినన్
బఁకినిఁబూననోప దతిభారముఁ దాల్పదు పక్కలెత్తు లే
చనిశమునూవితోటుపడు; నంకిలియూర్పులుచక్కగామియున్
అనువుగనుండు నీపసుల కాదిగుణంబులు లావులేమియున్.

తాత్ప:—వగర్పున్నపశువు తాపమందును.ఎండనుసహించిపని చేయ లేదు. బరువుమోయలేదు. లేచితోటుపడును. శ్వాసము బరువుగా నుండును.

## —♦ ఇందు కుచికిత్స ♦—

క. వసయును బిప్పలి శొంఠియుఁ
పసపును నస్యంబుసేయు పదిమిరియములున్
బొసగ నవి నూరి పశువుకు
వినువక బెట్టగ వగర్పు వేగమె మానున్. 124

తాత్ప:—వస, పిప్పళ్ళు, శొంఠి, పసపు, పదిమిరియములు చూర్ణముచేసి పశువునకు బెట్టిన వగర్పు అణఁగును.

క. విను మద్దరసము మానెడు
నెనిమిదిగండెములశొంఠి యేర్పడ మరిచం
బును పసపుఁ గూర్చి నాలుగు
దినములు బెట్టంగ మాను దెప్పునఁ బసికిన్

తాత్ప:—మానెడు అడ్డసరవురసమును, ఎనిమిదిగండెములశొంఠి యును, పసపు, మిరియాలును కలిపి నాల్గునాళ్ళిచ్చినయెడల వగర్పుమానును.

—♦ తే లు పో టు కు ♦—

క. వృశ్చికముపోటుతగిలినఁ
బశ్చాత్తాపమున; బొరల పదిమిరియమ్ముల్
గచ్చపొడి కన్నులం దిడి ‡
నిశ్చయముగ నవియుఁబెట్ట నెరి విషహరమౌ. 126

తాత్ప:—తేలు పశువును కట్టి నట్లయిన పదిమిరియాలు, గచ్చ విత్తులపొడుము నూరి కలికము నేసి అదే లోపలికి నహితనిూయవల యును.

—♦ ఇం కొ క వి ధ ము ♦—

క. వసయునుఁ బిప్పలి శొంఠియుఁ
బసపును నస్యంబునేయు పదిమిరియమ్ముల్
పసరముకు తేలుగుట్టిన
విస మణఁగును తక్షణంబు వేయు నికేలా? 127

తాత్ప:—తేలుకుట్టిన పశువునకు వస, పిప్పలి, శొంఠి పసపు పది మిరియములు పొడుముచేసి పీల్పించవలెను.

—♦ పా ము కా టు ల క్ష ణము ♦—

క. ఏపాము గఱచెనేనియు
నాపసరము విడచు నూర్పు లారోమంబుల్
ఏవును మరి గాండ్రించును
మేవును నీళ్ళను దొఱంగి మేదిని నొరగుఁ. 128

తాత్ప:—ఏపాముకఱచినను పశువు ఊర్పులు వదలును. రోమ ములు నిక్కబొడుచును. మూల్గుచుండును. మేత, నీరుముట్టక నేలపై బ డును.

‡ ప్రాసభంగము గలదు.

Dr. Kolli Surya Reddi



## అంగుళుచికిత్స

ఆ. నిగడనాగరసము నీరును బెట్టినఁ
నెల్లపాము విషము తెల్లమాను
భూతభయము విడిచిపోవును బసికిని
కాటు కమరఁ బెట్ట కన్నులకును. 129

తాత్ప:—నాగముషిణిరసము నీరును యిచ్చినచో అన్నిపాముల తాలూకు అన్నిరకముల విషములును హరించును. అది కాటుకపెట్టినచో భూతభయము పారిపోవును.

## వేరొకవిధము

క. వడికీటకంబు మూర్కొనఁ
గడుపుబ్బును రేలవేరు గంధము కలితో
నడరఁగ నూరుచు నడ్డెడు
కడుపున కిడినంత విషము గ్రక్కునమానుఁ. 130

తాత్ప:—పురుగూదిన పశువునకు కడు పుబ్బరించును. ఇందుకు రేలవేరు గంధముతీసి కలితోనూరి అడ్డెడు కడుపున కిచ్చినచో విషము నివారించును.

చ. ఒడల భుజంగదంతముల నొవ్వఁగ నాటిన దానిమాన్పగా
వడి గనుమూఁగ మూత్రిమును వారిధినౌ లవణంబు తెల్లజి
ల్లెడుకొన గోవుదుగ్ధముల లెస్సగ మర్దనఁజేసి యన్నియున్
కడురభసంబుతోఁ బసికిఁగన్నుల బెట్టిన నిర్విషంబగుఁ. 131

తాత్ప:—పాముపండ్లు గ్రుచ్చుకొన్నయెడల, ఆవిషము నివారణము గుటకు ఉదయమున లేవగానే పట్టినమూత్రము ఉప్పు తెల్లజిల్లేడుచిగురు నీనిని ఆవుపాలలో కలిపి మర్దించి కలికము వేసిన విషము ణఁగును.

—♦ పేరెఱుఁగనిరోగములకు ♦—

క. నీరుల్లి క్రోడిరెట్టయు
వారిధిలవణంబుఁ గూడ వసయును జతగా
నారయఁ దిలతైలముతో
పేరెఱుఁగనిరోగము [illegible] బోవును పసికిన్. 132

తాత్ప:—పశువులకు పేరు తెలియని వ్యాధులు వచ్చినయెడల నీరుల్లి, క్రోడిరెట్ట, ఉప్పు, వస నువ్వులనూనెతో యీయవలయును.

—♦ తైలము తలకెక్కినందుకు ♦—

* క. తైలము తలకెక్కిన ముకు
గోళముఁ గనకంపుతీఁగఁ గుట్టుచు ముఖముల్
గాలంగట్టుచుఁ గొట్టుదు
తాడిల్లగ నున్నయట్టి తైలము విరచున్. 133

---

‡క. తైలము తలకెక్కిన ముకు
గోళ్ళను కనకంపుతీగె కుట్టుచు మూఖముల్
కాలంగట్టుచు కొమ్ములు దా
టిల్లగ నున్నయట్టి తైలమువిరచున్. అనిపాఠాంతరముగలదు.

కాని యిందు, గణప్రాసభంగము కలదు.

తాత్ప:— నూనె తలకెక్కినప్పుడు ముక్కునకు బంగారపుతీగెకు ట్టి ముఖమును కాలికి అంటగట్టికొట్టినట్లయిన తలకెక్కిననూనె విరిగిపోవును.

## చెవిలో నిపుంటికి

క. చెవిలోన పుండుపుట్టిన
గవసున్నము * నిమ్మపులుసు గ్రిక్కన నిడి యా
చెవికిం గొమ్ముగట్టిన
వివరముగా నాపుపుండు వేగమె మానున్. 134

తాత్ప:—మిక్కిలి సులభము.

## సకలరోగములకు

క. ఇల సకలరోగములకునుఁ
దొలితొలికుంకుడును గొజ్జితోలును భూవే
ములపొడి కలితోనూరియు
కలికము గొట్టమునుఁ బెట్టగాఁ హరియించున్. 135

తాత్ప:—క్రొత్తకుంకుడుకాయలు గొజ్జితోలు నేలవేము వీటిని కలితోనూరిఅకలక మొకగొట్టము వేసినయెడల సకలరోగములును నివారించును.

క. కాన నొక కొంతశమనము
గా నది సహదేవుమతము గైకొని చేయఁ

‡ గవబనుమను అనిపాఠాంతరము.

ధేనువులు బ్రతుకుచావక
మానుగలావై సమస్తమనుజులఁ బోషించుర్. 136

తాత్ప:—ముక్కిలి సులభము.

—♦ ఒడలు కాలిన పశువునకు ♦—

క. మైయెల్లఁగాలుపసికిని
గాయంబునకెల్ల గాడ్దిగడపాపసరు మైఁ
బూయఁగ మానును; పరియున్
బూయుఁడు తరిచల్ల పిడక బూడిదెతోడన్. 137

తాత్ప:—ఒళ్ళంతయు కాలినపశువునకు దేహమంతటను గాడిద గడపాకు పసరు రాచి చల్లపిడకబూడిద కలిపి పైనఁ బట్టింపవలెను.

—♦ కణుతులకు ♦—

క. ఈనేముందర సిక్కపు
గా నవియనియదియు మేను గదుసుసబడినన్
ఈనకముందర డస్సిన
నానాటికి బొలుదరిగి నాసిలుచుండుర్. 138

తాత్ప:—ఈనకపూర్వము కణుతులుపుట్టి పగులక దేహము బిగుసుకొనియున్నను, ఈనినపిదప కృశించినను పశువు క్రమక్రమముగా క్షీణించిపోవును.

## కడుపులో చచ్చినదూడ బయటబడుటకు

ఆ. ప్రత్తియాకురసము బావంచరసమును
మేడిచక్కపొడియు మిరియపుఁబొడి
పుచ్చరసము నూనె పొయ్యంగ నుదరంబు
నందు చచ్చియున్న కందు వెడలు 139

తాత్ప:—దూడ కడుపులోనే చచ్చిపోయిన యెడల అదిబయట బడుటకు ప్రత్తియాకురసము, బావచాలరసము, మేడిచక్కచూర్ణము, మిరియాలపొడుము, పుచ్చాకురసము, నూనెపీటినికలిపి పోయవలెను.

## వాయువు

*సీ. ప్రత్త్యాకురసమును పరగమేడియుచక్క
రసము మిర్యపుఁబొడి రమణ పుచ్చ
రసము నూనెయు బోసి మసలక మరియు దు
త్తూరార్క పత్రంబుతోడ రసము
తక్కెడాకును నాముదమ్ము చేగొణిదాకు
నడ్డసరము వావి లొడ్డుగాను
దిరిశంబు తింత్రిణి వరకరివప్లేరు
వెసపారు రసములు విశదముగను

అదనుతైలంబు నెయ్య యాముదముతోడ
నన్నిసమభాగములుగూర్చి పన్నుగాను

సరస మారేడుపంటిరసంబుతోడ
మృదువుగా వండి పెట్టుచు నదములముగ. 140

ఆ. పాక మొప్పవండి పై(బూయ( బెట్టిన
సరగ వాతమంటు నరముకట్టు;
పాతకుంటు గొమ్ము పట్టి దీర్ఘముల్లైన
రోగతతులు పసికి రూఢి( దొలగు. 141

తాత్ప:—ప్రత్తియాకు, మేడిచెక్క రసము, మిరియపుపొడి, వుచ్చాకు రసము, నూనె వీనిని కలిపి ఉమ్మెత్త, [illegible]ము, తక్కలి ఆకులవసరులతో ఆముదము, చేగొణిదాకు, అడ్డసరము, దిరిసెనాకు, చింతాకు, ఏనుగపల్లేరు వీనిరసములను దిగుదాయనూనె, నెయ్యి, ఆముదము సమాంశములుగ చేర్చి మారేడుపండ్లరసముతో పాకమువచ్చునట్లు చక్కగావండి పశువు శరీరమునకు పట్టించి లోనికి సయిత, మిచ్చినట్లయితే వాతము, అంటు వ్యాధి, నరములపట్టు, పాతగుంటు, కొమ్ముపట్టు, దీర్ఘవ్యాధు లణంగును.

—♦ రొమ్ము దగ్గుకు చికిత్స ♦—

ఆ. రొమ్ము దగ్గు పసికి రుజ మాన్పదలతేని
తెలికె గంజి పాలు గలిపిపెట్టి(
ప్రత్తికాయ యావుపాలతో( గదుకుమిమ్మి
పెట్టబడిన పసికి పెట్టుమేత. 142

---

*ఈపద్యము సహదేవపశువైద్యశాస్త్రమున తప్పులకుప్పగా ముద్రితమయినది.

తాత్ప:—రొమ్ముదగ్గున్న పశువునకు నువ్వుపిండి గంజిపాలు కలిపి ప్రత్తికాయలు ఆవుపాలతో కుమ్మి యథావిధంబుగా మేతవేయవలెను.

—♦ ఇంకొకవిధము ♦—

క. దిరిశపు చెక్కరసంబును
మిరియంబును కలియనూరి మేదినిలోనన్
సురభులకు నాల్గుపూటలు
వినరవు చెవిలోనవిడువ వేగమె మానున్. 143

తాత్ప—దిరిశన చెక్కరసమును, మిరియమును కలియనూరి నాలుగుపూటలు ఎడమవైపైనచో కుడిచెవిలోను కుడివైపైనచో ఎడమ చెవిలోను వేయవలెను.

—♦ మరియొకవిధము ♦—

ఆ. దగ్గు నూర్పు నిలువుదాకి కాల్వేడలగ
రాకయున్న పసికి రావిచెక్క
మరియు పచ్చిపాలు మరినాల్గు విధములు
గొట్టుడేసి బెట్ట గోవులెదుగు. 144

—తాత్ప—దగ్గు ఎగశ్వాసకల్గి కాళ్ళు రాకయున్న పశువునకు రావిచెక్క మిరియము పచ్చిపాలు ఒక గొట్టముపెట్టినచో రొమ్ముదగ్గు అణగును.

—♦ నీరుడు బంధించుటకు ♦—

క. తన్నెరుగ కున్నదానికి
కన్నులలోపలను నూరుకటుకములు గదుగ

Dr. Kolli Surya Reddi
Telaprolu



నున్నంగ నూరిపెట్టిన
మున్నడుగ నున్నయట్టి మూత్రము జారున్. 145

తాత్ప—కడుపుబ్బరించి విశేషబాధబడు పశువుకండ్లలో త్రికటుకములకలికం వేయవలెను.

—♦ గ్రంథాంతము ♦—

క. విరటుని పట్టణమందున[illegible]
వర సహదేవుండు [illegible]పాలకుఁడయి తా
సురభులకు జేసె నీక్రి[illegible]
లరయఁగ నాచంద్రతారకంబుగ వెలయున్. 146

చ. నరనుత కీర్తిపాలకుడు నారయమంత్రి తెనుఁగుఁ జేసెనీ
సురభుల కిట్టివైద్యములు సొంపెనలారగ నెల్లదిక్కులన్
బరగు నిలన్ సుధాకరుఁడు, భానుడు మేరువు సాగరంబులున్
ధరణియు, దిగ్గజంబులును, దారకలున్ గలయంతకాలమున్.

స హ దే వ ప శు చి కి త్స

సర్వము సంపూర్ణము.

---

శ్రీచింతామణీప్రెస్, రాజమండ్రి.

## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| పుస్తకం సంఖ్య | TPLA130B118 |
|---|---|
| పుస్తకం పేరు | సహదేవ పశుచికిత్స. |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | No |
| మొత్తం పేజీలు | 57 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 5-8 |
| తయారు చేసినది | Habeeba |
| పేజీలు విడదీసినది | Rohith |
| స్కాన్ చేసినది | Heena |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |